# విష్ణుభాగవత సుధాసింధు

## ప్రథమతరంగము.



(బమ్మెర పోతనామాత్యకృత గ్రంధస్థము.)

భక్తజన పఠన సౌలభ్యముకొరకు

కన్లెపాలెపు సూర్యనారాయణ శాస్త్రిచే

ప్రత్యేకముగా అచ్చువేయించబడినది

కళా మూల్యము.

శ్రీగురుభ్యోనమః.

శ్లో॥ జన్మాద్యస్య యతోన్వయాది తరతశ్చార్థేష్వ
భిజ్ఞ స్స్వరాట్। తేనేబ్రహ్మహృదా య ఆదికవయే ము
హ్యంతియత్సూరయః ॥ తేజోవారిమృదాం యథావిని
మయోయత్రత్రి సర్గోమృషా । ధామ్నాస్వేన సదానిరస్త
కుహకం సత్యం పరంధీమహి ॥

సీ॥ విశ్వజన్మస్థితి విలయంబు లెవ్వనివలన నేర్పడుచును
వర్తనమున ।
వ్యావృత్తినమున, గార్యములం దభిజ్ఞుడై తానరాజగుచు
జిత్తమున జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వడు
బుధులు మోహింతు రెవ్వ
నికి నెండమావులనీట గాచాదు లన్యోన్య
బుద్ధి దానడరుచుండు

గీ॥ త్రిగుణసృష్టియందు దీపించు సత్యము ।
భంగి దోచునట్టి ప్రభు నిరస్త ।
కుహకు డెవ్వడతని గోరి చింతించెద ।
ననఘు సత్యుబరుని ననుదినంబు ॥

శ్రీరామ

# శ్రీమన్నారాయణావతారము

---

శుకుండు పరీక్షిన్మహారాజున కిట్లనియె,

క॥ భూమీశ్వర మైత్రేయ మ హాముని
విదురునకునట్లు హరిగుణ శుభలీలా మహాత్మ్య
ముఁజెప్పిన । నామైత్రేయునకు విదురుడనితో
మఱియుఁ॥

క॥ అగుణుండగు నీశ్వరుఁడు । జగదవనోద్భవ
వినాశ సత్కర్మములను । దగు లీలలతోడ నాతఁడు ।
నగుణుండై యుండు టెట్లు సౌజన్యనిధీ॥

క॥ చతురంతదీపింప ప్రియా । పతులకు బతి యు
నగ వెలయు పద్మాపతియే । గతి పుట్టించెను ప్ర
వృత్తులచే నవవిధ ప్రపంచము మఱియున్॥

క॥ సరసిరుహోదరు మంగళ । చరితామృత
పానమునకు సంగంబున ని । ర్భరుడగు విదురునకు
మునీశ్వరుడగు మైత్రేయుడనియె సజ్జనతిలకా॥

సీ॥ అనఘ యేకోదకమైయున్న వేళనంత
రుద్ధానలదారువితతి । భాతి చిచ్ఛక్తి సమే

తుడై కపటనిద్రాలోలుడగుచు నిమీలితాక్షు।
డైన నారాయణుండంబు మధ్యమున భాసురసు
ధాసేవ పాండురశరీరరుచులు సహస్ర శిరోరత్న
రుచులతో జెలిమిసేయగనొప్పు శేషభోగ।

తే॥ తల్పమున బవ్వళించి యనల్పతత్త్వ।
దీప్తి జెన్నొందగా నద్వితీయుడగుచు । నభిరతుం
డయ్యు గోర్కులయందు బాసి ప్రవిమలాకృతి
నానంద భరితుడగుచు ॥

గీ॥ యోగమాయావిదూరుడై యుగసహ
స్రకాల పర్యంత మఖిలలోకములు మ్రింగిపేర్చి
మతికాల శక్త్యుపబృంహితమున । సమతసృష్టి
క్రియాకలాపములదగిలి॥

క॥ తనజఠరము లోపలదాచిన లోక నికా
యముల సృజించుటకును సాధనమగు సూక్ష్మా
ర్థము మన । సునగని కాలానుగతరజోగుణ
మంతట॥

సీ॥ పుట్టించె దద్గుణంబున బరమేశ్వరునాభి
దేశమునందు నళిననాళ।ముదయించె మఱియప్ప
యోరుహ ముకుళంబు గర్మబోధితమైన కాల

మందు। దస తేజమున బరివృద్ధంబైన జలముచే
జలజాప్తగతి బ్రకాశంబునొందఁ జేసి లోకాశ్రయ
స్థితి సర్వగుణ విభాసితగతినొప్పు రాజీవమందు॥

గీ॥ నిజకళాకలితాంశంబు నిలిపి దానివలన
నామ్నాయమయుఁడును వరగుణుండు। నాత్మ
యోనియున్నైన తోయజభవుండు। సరవిజతు
రాననుండునాదనవమయ్యె॥

మ॥ అతిగంభీర విశాలవారినిధి తోయాంత
ర్నిమగ్నాంగుఁడై। చతురాస్యుండొగి దివ్యవత్సర
సహస్రంబబ్జ మూలంబు సన్నుతి వీక్షించియు
గానలేక భగవన్మాయా మహత్త్వంబువి। స్మృతి
గానింప విస్మితుఁడై మరల జేరెం దత్సరోజాత
ముఁ॥

తే॥ అట్లు గ్రమ్మర జేరి యయ్యబ్జపీఠ। మందు
నష్టాంగయోగ క్రియానురక్తి। బవను బంధించి
మహిత తపస్సమాధినుండి శతవర్షములు సను
చుండసంత॥

గీ॥ అట్టియోగ జనితమైన విజ్ఞానంబు। గలిగి
యుండి దాస గమలనయను। గానలేక హృదయ

కమలకర్ణికయందు। నున్నవాని దన్నుగన్నవాని॥

మ॥ కనియెఁ న్నిశ్చలభక్తి యోగమహిమం
గంజాతగర్భుండు శో।భనచారిత్రు జగత్పవిత్రు
విలసత్పద్మాకళత్రుఁ సుధా।శన ముఖ్యస్తుతి పా
త్రు దానవచమూజైత్రుఁ దళత్పద్మ నే।త్రు
నవీనోజ్జ్వల నీలమేఘ సుభగాత్రుం బక్షిరాట్ప
త్రునిఁ॥

చ॥ అలఘుఫణాతపత్రి నిచయాగ్రి సమం
చిత నూత్నరత్న నిర్మలరుచిచే యుగాంత తిమి
రంబునడంచి యకల్మషోల్ల సజ్జలముల జేసియందు
నవసారసనాళసితైక భోగముం।గలిగిన శేషతల్ప
మును గైకొనియున్న మహాత్ము నొక్కనిఁ॥

సీ॥ వరపీతకౌశేయ పరిధానకాంతి సంధ్యాం
బు దరుచినిచయంబుగాగ। కమనీయ నవహేమ
కలితకిరీటంబు రమణగాంచన శిఖరంబుగాగ।
మానిత ముక్తిక మాలికారుచినాను పతిత ని
ర్ఘర పరంపరలుగాగ। జెలువొందు నవతులసీ
దామకములు లాలిత తట ఔషధీ లతలుగాగ।

తే॥ వరభుజంబులు నికటస్థవంశములుగ।

బదముటంగణపాద పద్మచయముటుగ। లలితగతి
నొప్పు మరకతాచల విడంబి। శాత్మదేహంబు గ
లుగు మహాత్ము హరిని॥

వ. మఱియు నపరిచ్ఛిన్నంబును, నిరుపమా
నంబును, నిఖిలలోక సంగ్రహంబును, నతివిస్తా
రవర్తులాయమానంబునునై వివిధ విచిత్ర దివ్య
మణిభూషణంబుల నాత్మీయ నిర్మలద్యుతిచేతం
బ్రకాశంబు నొందజేయు దివ్యదేహంబు దనర;
వివిధంబులగు కామంబులభిలషించి విశుద్ధంబైన
వేదోక్త మార్గంబున భజియించు పురుషశ్రేష్ఠు
లకు గామధేను వనందగిన పాదపద్మయుగంబును
నలిక, ఫలక, లలిత రుచినిచయంబులకు నోటు
వడి కృపావాప్తిం జెందు చంద్రుని జపారూపం
బుల బహుసరోజంబుల నాశ్రయించె ననునొప్పు
పదనఖంబులును; కమలాభూకాంతలకు నుపధా
న రూపంబు లనందగు నీలకదళికా స్తంభంబు
లడంబు విడుచిందు నూరుయుగళంబును; గనక
మణిమయ మేఖలాకలాపాళి రాజంబును, గదం

బకింజల్క శోభిత పీతాంబరాలంకృతంబునై విలసిల్లు కటిమండలంబును, శృంగార వాహినీ జలావర్తంబునా బొలుపొందు నాభీవివరంబును; జఠరస్థ నిఖిల బ్రహ్మాండ ముహుర్ముహురుద్భవ కృశీభూతం బనంగు మధ్యభాగంబును, మహిత ముక్తా ఫలమాలికా విరచిత రంగవల్లీ విరాజితం బు, నవతులసీదామకిసలయ తల్పంబు, కుసుమ మాలికాలంకృతంబు, ఘనసార కస్తూరికా చందన విలిప్తంబు, కౌస్తుభరత్న దీప్తిప్రదీప్తంబు, శ్రీవత్సలక్షణ లక్షితంబు నై, యిందిరారమణికి కేళీమందిరంబనం బొల్చు వక్షస్థలంబును సుఖకేళీసమారంభ పరిరంభణాంభోధి రాట్కన్యకా కరాంభోజ కలిత కనకమణి కంకణ నికషంబులనం బొలుపారు రేఖాత్రియ విరాజమానంబైన కంధరంబును; సుమహితానర్ఘ్య దివ్యమణి ప్రభావిభాసిత కేయూర, కంకణ, ముద్రికా లంకృతంబులైన బాహువులును, సకలలోకార్తి నివారక దరహాస చంద్రికా ధవళితంబులైన, కర్ణకుండల మండన మాణిమరీచులు న రసంబులు న

లుపం దనరి, నిద్దంబులగు చెక్కుటద్దంబులును,
బరిపక్వబింబఫల, ప్రవాళ, పల్లవా, రుణాధరం
బును; సకల భువన పరిపాలనంబునకు నేనచాలు
దునని వివాదించు నయనయుగళంబునకు సీమా
స్తంభంబు, జంపక ప్రసూన రుచివిభాసంబునగు
నాసాదండంబును; గమల కుముదంబుల కుంబెం
పు నంపదించుచు, గరుణామృత తరంగితా
పాంగంబులై, కర్ణవిశ్రాంతంబులై, చెలువొందు
నేత్రంబులును; సలలిత శ్రీకారంబునకు నతుర
త్వంబు సార్థకంబయ్యె ననందగు కర్ణంబులును;
నిక్షుచాపవ్యయంబునాజూపట్టు భ్రూయుగళంబు
ను, నపరపక్షాష్టమీ శశాంక శంకాస్పద ఫాల
ఫలకంబును; నీలగిరిప్ర శృంగసంగత బాల
మార్తాండమండల ప్రతిబిత, పద్మరాగమణిఖచిత,
కాంచనకిరీటంబునం బొలుపారి, సూర్యేందు పవ
నానల ప్రకాశంబులకు నవకాశంబు సూపక, త్రి
లోకవ్యాపక సమర్థంబులగు తేజోవిశేషంబుల జె
లుఘొంది సంగరరంగంబుల దానవానీకంబుల హ
తింపంజాలు సుదర్శనాది దివ్యసాధనంబులచేమా

సదంబగు దివ్యరూపంబునుం గలిగి మఱియును,

ఉ॥ హారకలాప పుష్పనిచయంబుల జంచద
నర్ఘ్యరత్నకే। యూర కరాంగుళీయక మహోజ్జ్వల
బాహుసహస్రశాఖలో । ప్పారగ జూడనొప్పి
భువనాత్మకలీల నదృష్టమూల వి। స్ఫారిత భోగి
వేష్టిత విభాసిత చందన భూరుహాకృతిన్॥

మ॥ విలసత్కుండలి రాజసఖ్యమున నుర్వీ
భృత్సమాఖ్యన్। సముజ్జ్వలితోదార శిరోవిభూ
షణ సహస్ర స్వర్ణకూటంబులన్। సలిలావాసత
జారుకౌస్తుభ విరాజద్రత్న గర్భంబునన్ । నలినా
త్ముండు గనుంగొనంగ దగె మైనాకావనీ భృద్గతిన్॥

క॥ పితతార్థజ్ఞాన పద।స్తుతి మకరంద ప్రహ్లా
ష్టశ్రుతిజాత మధు । వ్రతగణ పరివృతశోభా ।
గతకీర్తి ప్రసవమాలికలుగలవానిన్॥

వ॥ కనుంగొని చతురాననుం డిట్లని స్తుతించె

సీ॥ నలినాక్ష మాయాగుణ వ్యతికరమున,
జేసి కార్యంబైన సృష్టిరూప। మున బ్రకాశించు
నీఘనరూప విభవంబు రూపింప దేహధారులకు
దుర్వి। భావ్యంబు దలపోయ భగవంతుడవునైన

పద్మాత్మ నీస్వరూపంబుకంటె । నన్యమొక్కటిస
త్యమై బోధకంబైన యదిలేదుగాన నీయుతుల
దివ్య ।  గీ॥ మైనరూపంబునాకు బ్రత్యక్ష మ
య్యె। నదియుగాక వివేకోదయమునజేసి । పరద
నీరూప మజ్ఞాన గురుత మోని । వారకంబయ్యె
నాకు శశ్వత్ప్రదీప॥

క॥ ఘన సత్పురుషా నుగ్రహ। మునకై య
మితావతార మూలంబగుచుం । దనరెడి నీరూ
పము శో। భనమగు; భవదీయ నాభిపద్మము
వలనన్॥

క॥ జననంబందిన నాచే। ననయము మొద
లనె గృహీతమయ్యె జగత్పా । వన నీమ నుస్వ
రూపము । ఘనరుచిరంబై స్వయం ప్రకాశక
ముగుటన్॥

వ॥ మఱియు జ్ఞానానంద పరిపూర్ణమాత్రం
బును, ననావృత ప్రకాశంబును, భేదరహితం
బును, ప్రపంచజనకంబును, ప్రపంచ విలక్ష
ణంబును, భూతేంద్రియాత్మకంబును, నేకంబు
ననైన రూపంబునొందియు నెందును బాధగాన

కట్టి నిన్ను నాశ్రయించెద ; నదియునుంగాక, జగన్మంగళ స్వరూప ధరుండవై నీయుపాసకుల మైన మామంగళంబుల కొరకు నిరంతర ధ్యానం బుచేత నీదివ్యరూపంబునం గానంబడితి విట్టినీవు నిరయభాక్కులై నిరీశ్వరవాదంబునం జేసి కుత ర్కంబులు ప్రసంగించు భాగ్య రహితులచేత నాదృతుండవుకావు మఱియుం గొందరు కృతా ర్థులైన మహాత్ములు భవదీయ శ్రీచరణారవింద కోశగంధంబు వేదమారుతా నీతంబగుటం జేసి తమ తమ కర్ణకుహరంబులచేత నాఘ్రాణించు చుండుదురు వారల హృదయకమలంబుల యం దు భక్తిపారతంత్ర్యంబున గృహీతపాదార విం దంబులు గలిగి ప్రకాశింతు వదియుంగాక వారి కులకు దరిద్ర్యాగార సుహృన్నిమిత్తంబైన భ యంబును దన్నాశనిమిత్తంబైన శోకంబును ద్ర వ్యాది స్పృహయును దన్నిమిత్తంబైన పరిభవం బును మఱియు నందుతృష్ణయునద ప్రయాసంబు నలబ్ధంబైన నార్తిమూలంబగు లదీయుంబైన వృథాగ్రహంబునుని శ్రీపాదార విందంబులందు

వై ముఖ్యంబైన కాలంబుగలుగు నంతకాలం
బును బ్రాప్తంబులగుంగాని మానవాత్మ నాయ
కుండవగు నిన్నా శ్రయించి నభయనివృత్తి
హేతువైన మోక్షంబు గలుగు మఱియును
గొందఱు సకలపాప నివర్తకంబైన త్వదీయ
నామస్మరణ కీర్తనంబులందు విముఖులై కామ్య
కర్మ ప్రావీణ్యంబునం జేసి నష్టమతులై యింద్రి
య పరతంత్రులై యమంగళంబులైన కార్యం
బులు సేయుచుందురు దానంజేసి వాతాదిత్రి
ధాతు మూలంబైన క్షుత్తృషాది దుఃఖంబుల
చేతను శీతోష్ణ వర్షవాతాది దుఃఖంబులచేతను
నతిదీర్ఘంబైన కామాగ్ని చేతను నవిచ్ఛిన్నంబ
గు క్రోధంబు చేతను దహ్యమానులగుదురు వా
రలగనిన నాచిత్తంబు గలంకంబొందు జీవుండు
భవదీయ మాయాపరిభ్రమ్య మాణుండై యా
త్మవేఱని యెప్పుడు దెలియునంతకాలంబు నిరర్థ
కంబై దుస్తరంబైన సంసారసాగరంబు దరియిం
పంజాలకుండు సన్మునీంద్రులైనను భవదీయనా
మస్మరణంబు మఱచి యితర విషయాసక్తులైరేని

వారలు దివంబులందు వృథాప్రయత్నులై సంచరించుచు రాత్రులయందు నిద్రాసక్తులై స్వప్నగోచరంబులైన బహువిధ సంపదలకు నానందించుచు శరీర పరిణామాది పీడలకు దుఃఖించుచుం బ్రతిహతంబులైన యుద్యోగంబుల భూలోకంబున సంసారులైన వర్తింతురు నిష్కామధర్ములై నిన్ను భజియించు సత్పురుషుల కర్ణమార్గంబులం బ్రవేశించి భవదీయ భక్తియోగ పరిశోధితంబైన హృత్సరోజ కర్ణికా పీఠంబున వసియింతు వదియెట్లనంగా॥

మ॥ వరయోగీంద్రులు యోగమార్గముల భావంబందు నేనీమనో। హరరూపంబు దలంచి యే గుణగణధ్యానంబు గావింతురు। పూరుషశ్రేష్ఠ పరిగ్రహంబునకునై పాల్పరతద్ధ్యాన గో।చర మూర్తి ధరియింతుగాదె పరమాత్మస్వరూపుండనై మాధవా॥

తే॥ అటయు నిష్కామధర్ములైనట్టి భక్తు।లందు నీవు బ్రసన్నుండవైన రీతి। హృదయములం బద్ధకాములై యనయుదేవ। గణములందు జ్ఞాన

న్నత గలుగవీవు ॥

చ॥ అరయ సమస్తభూత హృదయంబుల యందు వసించి యేకమై। పరగి సుహృత్త్రికాయా ను గుణభాసిత ధర్ముడవుం బరాపరే। శ్వరుడవు నై తనర్చుచు నసజ్జన దుర్లభమైనయట్టి సు। స్థిర మగు సర్వభూతదయచే బాడగానగ వత్తు వచ్యుతా॥

మ॥ క్రతుదానోగ్ర తపస్సమాధి జపసత్కర్మాగ్ని హోత్రాఖిల। వ్రతచర్యాదుల నావ తింపవఖిల వ్యాపార పారాయణ। స్థితినొప్పారెడి నీపదాబ్జయుగళీ సేవాభిపూజా సమా। శ్రిత ధర్ముండగువానిభంగి నసురారీ దేవమాధామనీ॥

తే॥ తవిలి తత్వతస్వరూపమై తనరి భూమి। మహిమచేతనపాస్త సమస్తభేద। మోహమూడ వఖిల విజ్ఞానమునకు నాశ్రి। యుండవగునీకు ప్రమొక్కెద నోరమేశ॥

క॥ జనవస్థితి విలయంబుల। కనయంబును హేతుభూతమగు మాయాలీ। లనుజెంది నటనసలి పెడు। ననభూతాత్మక నీకొనర్తు నభివందనముల్॥

తరల॥ జననవృద్ధి వినాశహేతుశ సంగతిం
గల యేను నీవు హరుండు ద్రిశాఖలై మఱు
వుల్ మరీచిముఖాముకుల్। దనరనం దుపశాఖలై
భవదాత్మ దీనికి మూలమై। యనయమున్ భు
వన ద్రుమాకృతివైన నీకిదె మ్రొక్కెదన్॥

మ॥ పురుషాధిశ భవత్పదాబ్జయుగళీ పూ
జాది కర్మక్రియా। పరతంత్రం జెందని మూఢచిత్తుని
జశుప్రియున్ మనుష్యాధమున్। జరమున్
నాశము నొందజేయు నతివక్రుంబైన కాలంబు
త। ద్గురు కాలాత్ముడవైన నీకు మదిసంతోషం
బునన్ మ్రొక్కెదన్॥

చ॥ భవదుదర ప్రభూతమగు పద్మమువంకు
వసించియున్న నే। నవిరళతావకీన కలితాంశమునం
దనరారు విశ్వముం। దపిలి రచించుచున్ బహు
విధంబుల బల్కెడి వేదజాలముల్। శివతరమై ఫ
లింప గృపసేయుము భక్తఫల ప్రదాయకా॥

చ॥ అనియజు కంజడోప వినయంబున జాగి
లి మ్రొక్కె జారులో। చన సరసీరుహాండజగుమ
సర్వజగత్పరిపాలనారతిం। దనడిసన్ముఖ బ్రోభుల

కుదానిటు సన్నిధిమైన యీశ్వరుం। డనయము నా
దు దుఃఖము దయామతిబాపెననంచు మునిద్రైడై ॥

తే॥ అట్లు వొడగని యార్తుడై నట్టి పద్మ। భ
వుని వాంఛితమాత్మ దీర్పంగదలచి। యతని మో
హనివారకమైనయట్టి। యమృత రసతుల్యమధుర
వాక్యములననియె ॥

క॥ నీకిప్పుడు గానంబడె। నాకులకును దురగ
పతిపినాకులకైనన్। వాకొనగం దలపోయను।
రాకుంను మదీయ రూపరమ్యత్వంబుల్ ॥

క॥ కావున మచ్చారిత్ర। ధావిలసితమై
న సుమహితస్తవము జగ। త్పావనము విగతసం
శయభావుడవై బుద్ధినిలుపు పంకజజన్మా ॥

క॥ సగుణుడనై లీలార్థము। జగముల గల్పిం
పదలమ చతురుడనన్నున్। సగుణునిగా నుతియిం
చితి। వగసంతసమయ్యె నాకు దామరసభవా ॥

క॥ అనుదినమును ద్విజగత్పా। వన మగునీ
మంగళస్తవంబు బఠింపన్। వినినను జనులకు నే
బొడ। గనబడుదు నవాప్తసకల కాముడనగుచున్ ॥

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

# ప్రకటన విన్నపము.

---

ఈరీతిగ నింకకొన్ని ముఖ్యవిషయములు ప్రచురించబడును.

గురుస్మరణ ప్రథమమం దవసరము కనుకను, నారాయణ పద్మభువులు స్మార్త గురు పరంపరకు ప్రథములు కనుకను, వీరినిగురించిన యీతరంగము మొదట వెడలినది. విశిష్టాద్వైతద్వైతులకు గూడనిది సమ్మతిమేకదా. కనుక సత్పురుషు లందరీకార్యమునకు సహాయులగుదురని దైవమును ప్రార్థించుచున్నాను.

సుజనవిధేయుడు,

కర్లపాలెము సూర్యనారాయణశాస్త్రి

బాపట్ల. దుర్మతివత్సర పుష్య శు౧౧ సోమవారం

విజయ ముద్రాక్షరశాల, బాపట్ల.

జనవరి.

1922.

